కోపాలు, పగ, దుఃఖాలు, దిగుళ్ళు, అవమానాలు, ఆశలూ, ఎక్కువకాలం పనిచేయక ఎప్పటికప్పుడే పట్టించుకోకుండా వ్యవహరిస్తూ ఉపయోగకరమైన పనులు చేస్తూ వెళ్ళే వాళ్లు మాత్రం ఎవరూ పిశాచత్వాన్ని పొందరు. తీవ్రమైన పగ, కృశించేటంత దిగులు, నిద్రపట్టనీయని ఈర్ష్యాదులు కలవాళ్లు భౌతిక దేహం విడిచిపెట్టి కూడా పట్టుదలలతో ముడివేయ బడిన లింగశరీరంతో కొంతకాలం వ్యవహరించవచ్చు. వారు పిశాచాలుగా వ్యవహరిస్తారు. ఇంకా భార్యాబిడ్డలపై తీరని వ్యామోహం కలవాడు డబ్బు, నగలు మొదలైనవి ఎవరితో చెప్పకుండా దాచిపెట్టినవాడు, ఆకస్మిక దుర్మరణము చెంది నపుడు అనగా హత్య, రైళ్ళు ఢీకొనడం మొదలైన సందర్భాల్లో చనిపోయినపుడు తప్పకుండా పిశాచాలవుతారు. వారి వ్యామోహానికి కారణమైన ప్రదేశంలో చాలాకాలం తిరుగుతూ ఉంటారు. రహస్యాలు వ్యక్తంచేయటానికి మనస్సు, నోరు, నాలిక కావాలి కనుక ఎవరినో పట్టి వారిద్వారా వాగుతూ ఉంటారు. మిగిలిన సామాన్య మరణాల విషయంలో పిశాచత్వం చాలా అరుదుగా సంభవిస్తుంది.

గిట్టనివాళ్లని పీడిస్తారా ?

వ్యక్తి : పిశాచాలైనవాళ్లు తమకు గిట్టనివాళ్లను పీడించడమనేది జరుగుతూ ఉంటుందా ?

మాస్టరుగారు : కొన్ని సందర్భాల్లో తప్పకుండా సాధ్యమవుతుంది. వాళ్ళు బతికి ఉన్నప్పుడు ఎవరైనా తీరని హాని చేసినా, హత్య చేసినా లేకపోతే వాళ్ళలో కక్ష్కుర్తి

ఏమాత్రం ఉన్నా వారిచేత పీడితులవుతారు. చనిపోయినవాడ
ఒక మంచివాడిమీద శత్రుత్వం పెంచుకొని చనిపోతే మాత్ర
ఆ మంచివాడిమీద వాడికేమీ పట్టుచిక్కదు. కర్మ ఉన్న
సందర్భాల్లో శత్రువునే కాక వాడితో ఉన్నవాళ్ళని కూడ
ఏడిపించడం సాధ్యమవుతుంది.

వ్యక్తి : ఆత్మహత్య చేసుకొన్నవాళ్ళు వాళ్ళ జీవిత కాల
అయిపోయేటంతవరకు దెయ్యమై తిరుగుతారంటారు. నిజం
అలా జరుగుతుందా మాస్టారూ!

మాస్టరుగారు : ఆత్మహత్య చేసుకున్నవాడు జీవిత కాల
కన్న చాల ఎక్కువకాలం పిశాచమై తిరగడానికి వీలుంది
భౌతికానికన్న పై లోకాల్లో ఆత్మహత్య పరహత్య అ
ఉండవు. హత్యానేరం ఒక్కటే ఉంటుంది. సామాన్యం
తాను తెచ్చుకున్న చిక్కుల్లోంచి బయటికి రాలేనివా
ఎక్కువమంది ఆత్మహత్య చేసుకుంటారు. తన ఆశ్రితుల
కూడా అన్యాయం చేసిన నేరం ఉంది కనుక ఆ మొత్త
జీవుణ్ణి పట్టుకొని వేధిస్తుంది. భయ-దుఃఖాదులు మనస
ద్వారా వ్యక్తమౌతాయి గాని, మనస్సు కన్న పైన అం
ఉంటాయి. కనుక మనస్సు లేకుండా పోయాక కూడా
స్తాయి. మనస్సులేని చెట్లకి, గర్భకోశంలో ఉన్న పిండా
దెబ్బతగిలితే ఎలాంటి బాధ ఉంటుందో అలాంటి బా
మనస్సు పోయాక కూడా హత్య చేసిన జీవుణ్ణి వేధిస్తుంది.

మనం చూడగలమా ?

వ్యక్తి : దెయ్యాల్ని మనం చూడటానికి సాధ్య మవు
తుందా మాస్టారూ ?

మాస్టరుగారు : దెయ్యాలు కొందరికి కనిపిస్తాయి, కొందరికి కనిపించవు. ఇంద్రియాలద్వారా తెలివి తేటల ద్వారా మాత్రమే పరిసరాలని అర్థం చేసికొనటం అలవాటైన జన్మలు కలవాళ్ళకి కనిపించవు. అలాకాక కొందరు పరిసరాల్ని సూటిగా అర్థంచేసుకొనే వాళ్ళుంటారు. వారికి ఇంద్రియాల ప్రమేయం లేకుండానే, తెలివి తేటల ప్రమేయం లేకుండానే బోధపడుతూ ఉంటాయి. వాళ్ళు "నే నిలా ఫీలవుతున్నాను. నా కిలా అనిపిస్తోంది" అనే పదాలలో అంతరాంతరాలైన సత్యాలను వెలిబుచ్చగలుగుతారు. వాళ్లకి కొందరి ప్రక్కన కూర్చుంటే సంతోషంగా ఉండటం, నీరసం తగ్గడం, ఆరోగ్యం బాగుపడటం జరుగుతుంది. అలాంటివాళ్ళకి దెయ్యాలుఉన్నట్లు తెలియటం, అనిపించడం, రూపంతో కనిపించడం, మాట్లాడటంకూడా జరుగుతుంది. వాళ్ళని మీడియమ్స్ అంటారు. అలాంటివారు వాతావరణం, అభ్యాసాలు అపరిశుభ్రంగా ఉంచుకుంటే దెయ్యాలు కనిపిస్తాయి. పరిశుభ్రంగా ఉంచుకుంటే గురువులు సిద్ధులు మొదలైనవారు కనిపిస్తారు. ఆ కనిపించడం వినిపించటం కన్నులకీ, చెవులకే కాక మనస్సుకి అయిఉంటుంది. కనిపించని వాళ్ళు కనిపించేవాళ్ళని ఊహాజీవులనడం సత్యంకాదు. ఈ ఊహాజీవులు ఆ దెయ్యాలతో సంప్రదించిన వెనుక వారిని గూర్చిన విషయాలు ఎవ్వరూ ఎరుగనివి వివరంగా చెప్పగలగడమే దీనికి తార్కాణం.

కొరివి దెయ్యా లున్నాయా ?

వ్యక్తి : కొరివిదెయ్యాలుఅంటారే అవినిజంగా ఉంటాయా?

మాస్టరుగారు : ఉంటాయికాని అవి దెయ్యాలు కా
కొన్ని రసాయనిక పదార్థాలు ఏర్పడిన భూములనుండి కొ
రకాల వాయువులు బయటకువచ్చి ప్రాణవాయువుతో సంయో
గము చెందినపుడు రవ్వలు, వెలుతురు వస్తాయి. మిణుగు
పురుగులు ఎలా నిప్పురవ్వలు కావో కొరివిదెయ్యాలు అలా
దెయ్యాలు కావు.

వదిలించడానికి తతంగం అవసరమా ?

వ్యక్తి : దెయ్యం పట్టినవాళ్ళకు వదిలించడానికి భూ
వైద్యులు చాలా తతంగం చేస్తారుగదా! నిజానికి ఆదం
అవసరమా ?

మాస్టరుగారు : తతంగాలు అన్నిరంగాల్లో ఉన్నట్లే భూ
వైద్యంలోకూడ ఉన్నాయి. వైద్యుడుచేసే వైద్యంలో ప
కూటికి వేసే దుస్తులు మొదలైన ఆడంబరాలుంటాం
అదంతా వైద్యశాస్త్ర మనలేం గదా! ప్లీడరు ఇచ్చే తర్క
అంతా న్యాయశాస్త్రం అనలేం కదా! అలాగే భూతవైద్యం
న్న తతంగం భూతవైద్యం అనలేం. ముఖ్యంగా దెయ
ట్టినవాళ్ళని హింసపెట్టడం; చెప్పుతో, చీపురుతో కొట్ట
మొదలైన పశుప్రాయాలైన విధానాలు విషవైద్యా
వంటివి. నిజమైన భూతవైద్యంలో నిర్మలమైన, ప్రశాంత
వాతావరణాన్ని కల్పించడం, చక్కనిసంగీతం, దైవస్మ
మాత్రమే ఉంటాయి. ముఖ్యంగా దెయ్యంపట్టిన వా
వారిలో ఉన్న దెయ్యాన్ని, దైవంగానో, తన గురువుగా
ధ్యానంచేయడం తిరుగులేని మార్గం. కొన్ని ద్రవ్యాలు అ

యత్నంగా, సునాయాసంగా, దయ్యాలను పోగొడతాయి. ఉదాహరణకు తులసిదళం తినిపించడం, రావిచెట్టుకింద కూర్చోపెట్టడం, మంచిగంధం, కర్పూరం ధూపం వేయడం, తెల్ల జిల్లేడు వేరు, ఉత్తరేణివేరు దేహానికి తాకేటట్లు కట్టడం వల్ల మోటుప్రయత్నాలు ఏమీ అక్కర లేకుండా భూతావేశం తగ్గిపోతుంది.

భూతాలను వశపరచుకోవచ్చా ?

వ్యక్తి : భూతాలని కొందరు భూతవైద్యుల్లాంటి వాళ్ళు వశంలో వుంచుకొని గిట్టనివాళ్ల మీదకు ప్రయోగిస్తారు అంటారు. అది సాధ్యమా మాస్టారూ ?

మాస్టరుగారు : భూతాలను తమవశంలో వుంచుకొని కొందరిమీదకు ప్రయోగం చేయడం పూర్తిగా సాధ్యమే. కాని పుట్టుక చేత ఈర్ష్య, అసూయ మొదలైన లక్షణాలు లేనివాళ్లు కొందరు వుంటారు. వాళ్ళు సాధారణంగా చదువు మొదలైన వాటిల్లో చాలా ప్రావీణ్యం గడించినా ఇతరులతో వ్యవహరించడంలో తెలివితక్కువగా, అమాయికంగా, కొంచెం పిచ్చివాళ్ళలాగవుంటారు. ఎవరైనా హేళనచేసినా, నిందించినా వాళ్ళబుర్రకి ఎక్కవు. అవమానపడట మంటే యేమిటో వారికి తెలియదు. అలాంటి వాళ్ళమీద మాత్రం ఇవి పని చేయవు. లేదా ప్రకృతి శక్తుల రహస్యాలు సరియైన గురువు వద్ద తెలుసుకొని వైరాగ్యంతో జీవితాన్ని నడిపే వాళ్లమీద

కూడ పనిచేయవు. ఇక దయ్యాలచేత వస్తువులను కదలించడ
పనులు చేయించడం విశేషంగా సాధ్యపడదు. బ్రతికి వున్న
ప్పుడు వాళ్ళచేత చేయించే చిల్లరపనులు కొన్ని సాధ్యపడ
తాయి. ఇదికాక కొందరు భూతతంత్రజ్ఞులు పెద్దకొండరాళ్ళన
క్రిందకు దింపించడం మొదలైన మంచిపనులుగాని, నదుల్లో
పడవలు ముంచెయ్యడం మొదలైన చెడ్డపనులుగాని చేయిస్తు
ఉంటారు. అవి దయ్యాలవల్ల సాధ్యంకావు. ఒక్కొక్కచోట
వ్యక్తులుగా మెలిగేప్రకృతి శక్తులుఉంటాయి. వాటిని యక్షుల
ంటారు. ఉదాహరణకు చీకటిగావున్న కొండల యిరుక
లోయల్లో చిన్న కోనేరుచుట్టు గుబురుచెట్లు, వాటిలో సర
ృశ్చికాదులు ఒకగుంపుగా ఉంటాయి. అక్కడ విశేషం
మనుష్యసంచారము లేకపోతే ఆ మొత్తం ప్రదేశంలో ఒ
వుడు ఉంటాడు. మిగిలినచెట్లు, విషజంతువులు ఆ జీవుడి శరీ
గాలుగా పనిచేస్తుంటాయి. అందులో ఒక జంతువు
ితే నొప్పి మిగిలినవాటన్నిటికీ తెలుస్తుంది. కొన్ని క్షణాల్లో
గెత్తుకొని వస్తాయి. అలాంటి జీవిని యక్షుడు (grou
ంటారు. ఆ యక్షుణ్ణి శాస్త్రవిధానంలో వశపర
అనగా మైత్రిచేస్తే పడవలు ముంచడం చేయవచ్చు
రు రాత్రిపూట అనుకున్నచోటికి రాళ్ళువిసరడం, మ
్న ఈడ్చుకుపోవడం మొదలైన పనులు దుష్టతాంత్రికు
స్తారు. పూర్వం ఋషులు ఈ యక్షుల సహాయంతో
బ్బులు నయంచేయడం, వస్తువులు మోయించడం మొ
లైన ఉపయోగకరమైన పనులు చేయించేవారు.

గృహమెలా ఉంటే దెయ్యాలు రావు ?

వ్యక్తి: గృహ వాతావరణాన్ని ఏ రీతిగా తీర్చిదిద్దుకుంటే దెయ్యాల ప్రభావం పడకుండా ఉంటుంది ? ఆ తీర్చిదిద్దుకొనే విధం మీరు వివరంగా చెప్పాలి ?

మాష్టరుగారు: తప్పకుండా చెబుతాను. భూత ప్రేతాదుల ప్రభావం ఒక ఇంట్లో ఉన్న వాళ్ల మనస్సుల మీద ముఖ్యంగా ఆధారపడి ఉంటుంది. సామాన్యంగా వైద్యము, శుచి, ఆరోగ్య శాస్త్రము మొదలైన వాటిమీద ఆస్తిక్య బుద్ధి లేకపోవడం, భయకారణాల మీద నమ్మకం పెంచుకోవడం, ఉన్న యింట్లో దెయ్యాలు ప్రవేశించడానికి సులువు ఉంటుంది. ఉదాహరణకి వైద్యుడు తమ జీతగాడుగా అనుకోవడం, ఎవరో తనకు చేతబడి చేశారుఅనుకోడం, అందరూ తనను చూచి ఈర్ష్యపడుతున్నారు అనుకోవడం మొదలగు భావాలు ఉన్న చోట, సామాన్యంగా, అసమర్థమైన కోపంతో ఎప్పుడూ ఎవరో ఒకరిని ఆడిపోసుకోవడం ఉంటూ ఉంటుంది. అలాంటివాళ్ల ఇళ్లలోకి ఏ దెయ్యమైనా, ఎప్పుడైనా ప్రవేశించ వచ్చు. వాళ్లని ఆ మార్గము వదిలిపెట్టమని చెబితే వాళ్లకు సాధ్యం కాదు, నచ్చదు కూడా. ఇంట్లో అందరూ పరస్పరత్వం లేకుండా సూది మొనలు తేలిన కంకర రాళ్ల గుట్టల్లాగ ఉంటారు. ప్రతి యిద్దరి మధ్య మూడవవాడితో రహస్యంగా చెప్పుకొనేవి ఉంటూ ఉంటాయి. అలాంటి ఇళ్లలో మనస్సులు పరిశుభ్రపడటానికి అవకాశం ఉండదు. కాని ఏరోజు చెత్త ఆరోజు మనస్సులలోనుండి ఎత్తి పార

బోసుకొనటానికి వీలవుతుంది. దానికి ఒకటే మార్గః
ఒకే రూమ్‌కి నేతిదీపం, అగరువత్తి పెట్టి ఒకే చో
గాని, పూజ గాని జరుపుకోవాలి. ఆ రూమ్‌కి
అక్కడ ఉండాలి. దీనిని సాధ్యపరచుకొన్న
దెయ్యాలు రాలేవు. ఇంకా దొడ్లో తులసి చెట్టు,
వేప చెట్టు, రావిచెట్టు, తెల్ల జిల్లేడు చెట్టు,
దమనం, మరువం, పారిజాతం, మామిడి చెట్టు ఉ
దెయ్యాలు ఆకర్షింపబడటానికి వీలు లేకుండా
ఇంకా పొద్దెక్కకుండా స్నానం చేయడం, ఏ రో
ఆ రోజు మార్చుకోవడం, నెలసరులలో వేరుగా
పుటిటివాళ్ళను వేరేగదిలో ఉంచడం, కాళ్ళు చేత
కొక్కని భోజనశాలలోకి పోవడం ఈ విషయంలో చ
రిస్తాయి. భారత భాగవతాది గ్రంథాలుగాని, మః
సచ్చరిత్రలుగాని, నిత్యము కొంతసేపు చదివి వివ
డం ప్రబలంగా ఉపకరిస్తుంద.

## B. దేహం విడిచిన తరువాత...

చనిపోయే ముందు తెలుస్తుందా ?

వ్యక్తి : మాస్టరు గారూ! చనిపోయే ముందు తాము చనిపోతున్నామని, ఆ చనిపోబోయే వారికి తెలుస్తుందా? ఒక వేళ తెలిస్తే అప్పటి అనుభూతి ఎలా ఉంటుంది ?

మాస్టరుగారు : చాలామందికి చావు అంటే ముఖ్యంగా సొంతచావు అంటే అంతో, ఇంతో భయం ఉంటుంది. వాళ్ళకి మాత్రం చనిపోయే సమయంలో తెలిస్తే గుండె బేజారై పోతుంది. అలాంటి వాళ్ళకి ఇంకా కొంచెం ముందు తెలిస్తే ఆ భయంతోనే చచ్చిపోవచ్చు. అలాంటి వాళ్లకు ఆ సమయంలో ప్రకృతి తెలియకుండా చేస్తుంది. అంటే మృత్యువుకు ముందు తెలివి తప్పుతుంది. భయం ఎంత తీవ్రంగా ఉంటే అన్ని గంటలో, రోజులో, నెలలో తెలివి తప్పిన స్థితిలో ఉండిపోతారు. ఆ స్థితిలో ప్రకృతి శక్తులు మత్తుయిచ్చి అట్టే పెట్టి ప్రాణానికి దేహానికి మధ్య బిగించి ఉన్న మేకులన్నీ పీకుతారు. దేహధాతువుల్ని పంచ భూతాల లోకి మలచి పార్శిల్ కట్టి వి. పి. చేస్తారు. తీరా పనంతా పూర్తి అయిన తరువాత మత్తువదలి తెలివివస్తుంది.

ఇక మృత్యుభీతి తొలగి పోయినవారు తప్పకుండా ఆరోగ్య వంతులు, జ్ఞానులు, ప్రపన్నులు, వైరాగ్య సంపన్నులు అనే కోవలలో దేనికో ఒక దానికి చెంది ఉంటారు. అలాంటి వాళ్ళకి కలగబోతున్న దేహ పరిత్యాగం స్పష్టంగా తెలుస్తుంది. వాళ్ళకి చనిపోవడం ఉండదు. దేహం విడవటం

మాత్రం ఉంటుంది. వెన్నెముక దిగువనుండి పైకి 
ల్లాగ అనిపిస్తుంది. అలా ఎందు కనుపిస్తుందం టే
మూలాధారంనుండి ఊర్ధ్వగతి పడుతుంది. ఇం
ఇంద్రియార్థాలు అందవు— ఏదో ఆలోచిస్తూ ఉం
ఎదుట నున్న వస్తువులు కనుపించనట్లు. అటుపై
శ్వాస కలిసి ఒక్కటి అవుతాయి. ఆ ఒక్క
పోతుంది. ఇంకొక కక్ష్యలో ప్రజ్ఞ మేల్కొంటు
మహానుభావులకు జరుగుతుంది.

అలాకాక పీకులాటలు, పితలాటాలు ఉన్నవా
చెవులు అన్నీ పనిచేస్తూనే ఉంటాయి. చుట్టూ వ
చేసే గోలంతా తెలుస్తూనే ఉంటుంది. కానీ ఏ భా
ఆధీనంలో ఉండదు. శ్వాస ఆడుతూ ఉన్నా మాట
నవి సాధ్యపడవు. ఏడవటానికి గాని, మాట్లాడటా
తల ఊపటానికి గాని అవసరమైన కీళ్ళు మేకులన్నీ
ఉంటాయి. ఉదాహరణకు వెనక డిప్ప ఊడదీసిన
రంలో ముళ్ళ చక్రాల్లాగ అన్నీ కొంతసేపు తి
ఉన్నా ఏమీ స్వాధీనంలో ఉండదు. బాకీలు వసూ
దని, భార్యాబిడ్డలు ఆదరించలేదని తీవ్రంగా 
పడే వాళ్ళకి ఇలాంటి స్థితి కొన్నిరోజులుండవచ్చు

వ్యక్తి : అయితే పీకులాటలు, పితలాటాలు
నరకం అనుభవిస్తూనే దేహం వదులుతారన్నమా

మాస్టరుగారు : అందుకే అన్నారు మనవా
కున్న వాళ్ళకు చేసుకున్నంత అని.

చనిపోయిన తరువాత ?

వ్యక్తి : ఒక వ్యక్తి చనిపోయిన తరువాత అతను ఏమౌతాడు? ఈ విషయాన్ని గూర్చి రకరకాలుగా చెప్పుకుంటూ ఉంటారు. నిజానికి జరిగేదేమిటో అనుభవజ్ఞులైన మీరు చెప్పాలి.

మాస్టరుగారు : అలాగే! మీకు అర్థమయ్యేటట్లుగా ఉన్న నిజాన్ని చెబుతాను. చనిపోవడంలో పోవడం అనేది ఏమీ ఉండదు. మనిషి అంటే చోటుతో, మట్టితో, నీళ్ళతో, గాలితో, వెచ్చదనంతో, చేయబడిన ఒకబొమ్మ. ఆ బొమ్మ మధ్య ఉన్న చోటు మనిషిగా మేల్కొని పనిచేస్తూ ఉంటుంది. శబ్దంచేస్తూ ఇద్దరి మధ్య ఉన్నచోటు ధ్వని తరంగాలుగా ఎలా మేల్కొంటుందో అలాగే శ్వాసచేసే గుండె కాయలో ఉన్నచోటు ఆల్టర్నేషన్ ఆఫ్ కరంట్స్ (Alternation of currents) గా మేల్కొని ఎలక్ట్రోమేగ్నెట్ (Electro Magnet)లాగ జీవ తరంగాల నింపుతుంది. పంపడం మొదలు పెట్టేవరకు ఆ కాశంలో ఉన్నశక్తి స్టార్టర్ (Starter) గా పనిచేస్తుంది. పంపడం మొదలు పెట్టాక గుండెకాయలో ఆకాశాన్ని మేల్కొలిపే శక్తి వేరవుతుంది. అప్పటినుండి దాని ఆధీనంలో శరీరం పనిచేస్తూ ఉంటుంది. అలా వేరైన మేలుకొలుపునే జీవుడు అంటాము. ఒకసారి వేరైన తరువాత మళ్ళా అది చోటుగా మారడం చాలా కష్టం. అలావాటు చొప్పున స్థూల సూక్ష్మ దేహాలుగా పనిచేస్తూ ఉంటుంది. స్థూల దేహం విడిపోయాక కూడా

కొన్ని వేల సూక్ష్మదేహాలు పనిచేస్తూనే ఉంటాయి. పాము
గాని, కోడికిగాని, మెడ నరికాక కొంతకాలం దేహభాగాలు
కదుల్తూనే ఉంటాయి. ఇదేవిధంగా భౌతికమైన చావు జరిగిన
తరువాత సూక్ష్మదేహాలలో జీవుడు బద్ధుడై ఉంటాడు
ఇంతలో మరొక దేహం ధరిస్తాడు. దానినే పునర్జన్మ అ
టారు. ఆవేశాలు, ఆదర్శాలు, ఆచారాలు తన మనస్సు
ఏమాత్రం బంధించకుండా చచ్చిపోయిన జీవుడికి ఈ సూక్ష్
దేహాలు కూడ విడిపోతాయి. అప్పుడు, ఆ మేల్కొన్న జీ
తరంగం చోటులో కలిసిపోతుంది. ఇక జీవుడుండడు. పునర్జ
ఉండదు.

తమ స్థూల సూక్ష్మ శరీరాల మీద స్వామిత్వం సిద్ధి
చిన కొందరు మహనీయులు కూడా స్థూల శరీరం విడిచా
సూక్ష్మ శరీరాలను చెదిరి పోకుండా నిలిపేస్తారు. అం
తమకు జన్మరాహిత్యం అక్కరలేదని కోరిమళ్ళీ భౌ
దేహాలలోకి వస్తారు. ఆ పని జగత్కల్యాణం కోసం చేస్తా
కనుక వారికవి పునర్జన్మలైన కారణ జన్మలు. భౌతిక జ
కన్న ముందే ఒక పవిత్ర కారణం ఏర్పాటు చేసుకోగలిగి
అతనిని కారణ జన్ముడు అంటారు. పరమగురువులు మె
లైన వాళ్లు అలాంటివాళ్ళు. చెప్పాలంటే సృష్టిలో జరు
తున్న కథయిదే.

వ్యక్తి: సృష్టిరహస్యాన్ని క్షణంలో సులువుగా :
చెప్పారు మాస్టారు! మీరు చెపుతుంటే జరుగుతున్న
కళ్ళకు కట్టినట్లుగా ఉంది.

మాస్టరుగారు : ఉన్న సత్య మింతేనోయ్! దీనిని అనేక కోణాలలో చూడటం వల్ల అనేక సిద్ధాంతాలు పుట్టుకు వచ్చాయి.

స్వర్గ నరకాలున్నాయా ?

వ్యక్తి : శరీరం విడిచి పెట్టగానే తానుచేసుకున్న కర్మ ఫలితాలను బట్టి స్వర్గ, నరకాలలో ఏదో ఒకదానికి పోతా డని పురాణాలలోను, కథలలోను చెపుతూ ఉంటారుగదా మాస్టరుగారూ! నిజంగా ఆ స్వర్గ, నరకాలనేవి ఉన్నాయా? ఉంటే వాటి నిజస్వరూపం ఏమిటి?

మాస్టరుగారు : భౌతిక దేహం విడచిన తరువాత కలిగే అనుభవాలు సూక్ష్మ శరీరాల చిక్కదనాన్ని బట్టి అనేక విధాలుగా ఉంటాయి. చనిపోగానే కలిగే అనుభవాలు చని పోకముందు చావునుగూర్చి అతనికున్న అభిప్రాయాలనుబట్టి ఉంటాయి. పురాణాలు నమ్మిన వాళ్ళు చనిపోగానే హిందూ చావు వస్తుంది. అంటే దున్నపోతు, యముడు కనుపిస్తారు. క్రైస్తవులు చనిపోగానే రెక్కల దేవకన్యలు, గులాబీ దండ, వెలుగుతున్న క్రాసు కనుపిస్తాయి. మహమ్మదీయుడు చని పోతే చంద్రవంక, "క బా" అనే అక్షరం కనుపిస్తాయి. విశ్వాస పాత్రుడయిన రాజకీయ నాయకుడు చనిపోతే వాడి తాలూకు జెండా కనుపిస్తుంది. ఇవి స్మరణలతో కలగలు పుగా బెడ్డలు, బియ్యము కలిసి నట్లుంటాయి. కనుక వీటిని అనుభవా లనరాదు. కలత నిద్రలో ఉన్నవాడికి బయట

మాట్లాడుకునే మాటలు వినిపిస్తూ ఉంటాయి. అప్ప
స్థితిని నిద్ర అనడం ఎంత సత్యమో, ఈ యమద
మొదలైనవి అనుభవా లనడం అంతే సత్యం. ఈ స్థి
పోకుండా మళ్ళీ అంతకుముందు దేహంలోకి మెలకువ
రావచ్చు. అప్పుడు వాడిని చచ్చి బ్రతికాడంటార
డెవడన్నా విభూతి గాని, మందుగాని వేస్తే చచ్చి
బ్రతికించాడంటారు. ఇవేవీ అక్కర లేకుండా బుద్ధి
కంగా చచ్చిబ్రతికిన వాళ్ళు కూడా ఉన్నారు.

ఈ స్థితిని దాటి ఇంకా కొంత లోతుగా చచ్చి
వాళ్ళకి కలిగేవి నిజమైన అనుభవాలు. అలాంటివాళ్ళు
మళ్ళా వెనక్కి బ్రతికిన వాళ్ళున్నారు. వాళ్లు పొంద
వాలు ఏ మతం వాళ్ళకైనా ఒకటిగానే ఉంటాయి. ఒక
భవం వాళ్ళందరి విషయంలో రికార్డు చేయబడింది. ఒ
గొట్టంలో నుండి ప్రయాణం చేస్తున్నట్లు, దాని
చక్కని వెలుగు ముద్ద ఉన్నట్లు, ఆ వెలుగుదగ్గరకు
ఉన్నకొద్దీ ఉక్కిరి బిక్కిరి తగ్గుతున్నట్లు, ప్రాణానికి
కలుగుతున్నట్లు అనిపిస్తుంది. అయినా రాక తప్పక
తాన మళ్ళా వెనక్కి ఉక్కిరి బిక్కిరిలోకి దూ
ట్లనిపించి వెనుకటి శరీరంలో మేల్కొంటారు.

ఇకొంక విశేషం ఉంది. భౌతిక శరీరం ఉ
దానిద్వారా పనిచేసే మనస్సు ప్రజ్ఞ వేరు. భౌతిక
పోయాక సూక్ష్మ శరీరాలు మాత్రమే ఉన్నప్పుడు
ప్రజ్ఞ వేరు. భౌతిక శరీరంలో గుండా పనిచేసే ప్రజ్ఞ
యాలలో వస్తువుల ప్రతిబింబాలను మాత్రమే గ

దాన్నిబట్టి ఎదుట ఆ వస్తువులు ఉన్నట్లు గ్రహించ గలుగుతుంది. అంతేగాని వస్తువుల అస్తిత్వం సూటిగా గ్రహించడం దీనికి సాధ్యం కాదు. ఉదాహరణకి మన కంటి ఎదురుగుండా ఉన్న శరీరంపై పడిన వెలుగు కిరణాలు వెనుదిరిగివచ్చి మన కంటిమీద ఆ శరీరాకారం ఫోటోపడటం వల్ల మాత్రమే ఫలానా వ్యక్తి మన ఎదురుగుండా ఉన్నాడని మనం గ్రహించ గల్గుతున్నాం. అంటే మనం ప్రతి బింబాలను చూచి వ్యక్తులతో మాట్లాడుతున్నామన్న మాట. ప్రతిబింబం నిమిత్తంగా ఆ వ్యక్తిని గూర్చిన స్మరణ, లేక పూర్వ స్మృతి మనమీద సంస్కారంగా పనిచేయడాన్ని ఆ వ్యక్తితో పరిచయం ఉండడం అంటున్నాం. పరిచయం స్మరణకు సంబంధించినది. ప్రతిబింబం కంటికి సంబంధించినది. ఈ రెండింటిలో అలవాటు చొప్పున ప్రతిబింబం మీదే ఎక్కువ ప్రాధాన్యం ఉంటున్నది. శరీరం వదలగానే దీనికి అవకాశం పూర్తిగా పోతుంది. అంటే ప్రతిబింబాన్ని చూడటమనేది ఉండదు గదా! అప్పుడు వ్యక్తిని గూర్చిన స్మృతి, సంస్కారము మాత్రమే మిగులుతాయి. కొన్ని గంటలలో స్మృతికి ఆధారమైన మనస్సు కూడా పోతుంది. స్మృతి కూడా సంస్కారంగా వుండిపోతుంది. ఆ స్థితిలో స్మృతికి, ఆ వస్తువు అస్తిత్వానికి భేదం వుండదు. ఒక విషయం జ్ఞప్తికి రావడం అన్నా జరగడం అన్నా ఒక్కటే. అప్పులవాడు జ్ఞప్తికి వచ్చేసరికి నిజంగా వచ్చి నెత్తిన కూర్చుంటాడు. ఈ సంస్కార స్మృతులలో మంచివీ చెడ్డవీ రెండూ వుంటాయి. కానీ మంచి వాటి కన్నా ముందుగా భయకారణాలు, శోక కారణాలు తల

ఎత్తి ప్రాధాన్యం వహించడం సహజం. పొరుగూరు
నపుడు అక్కడ మనం ఎరుగున్నవాళ్ళలో సత్కరించేవాళ
అప్పులవాళ్ళు వున్నారనుకో. ఆ ఊళ్ళో దిగుతూ వుండ
మొదట అప్పులవాడు కనిపిస్తాడేమో ననిపిస్తుంది గాని,
వాళ్ళు కనిపిస్తే బాగుండును అని జ్ఞాపకం రాదు. అల
చనిపోయిన తరువాత అప్పులవాళ్ళు, శత్రువులు, రోగ
నొప్పులు అంతకుముందు ఎవరో చనిపోయిన దుఃఖా
తానుచేసిన నేరాల స్మృతులు, స్మృతి సంస్కారాల
తేలతాయి. అంటే వాళ్లంతా నెత్తినెక్కి కూర్చుంటా
వారిని గూర్చి ఏ బాధలు వస్తాయని భయపడుతున్నా
ఆ బాధలు పెడుతుంటారు. ఈ అనుభూతినే యమలో
అంటారు. తలనొప్పి, కీళ్ళ నొప్పులు జ్ఞప్తికి వచ్చినపుడు
నొప్పులకు రూపకల్పన వస్తుంది. ఆ రూపాలు ఈటెల
కత్తులతో, బల్లాలతో పొడుస్తారు. మూలవ్యాధి వ
దనుకో. దానికొక రూపం కల్పింపబడి ఆ రూపం నిః
మీద వేయిస్తుంది. చీము నెత్తురు బాధలుంటే ఆ నదుల
పీడు ఈదుతూ వుంటాడు. శస్త్రచికిత్సల్లాంటివి జరిగి ఉ
ఆ స్మృతులు కత్తులతో కండలు, ఎముకలు ముక్క
తీస్తారు. ఆ కోశంలో ఉన్న ప్రజ్ఞ అరిగిపోయేదాకా
యమలోక బాధలు తప్పవు. అది పూర్తిగా అరిగిపో
వెనుక తనకు తృప్తినిచ్చే సంస్కారాలు గుర్తుకొస్తా
ప్రేమ పాత్రులైన బంధువులు, మిత్రులు జ్ఞప్తికి వస
అంటే వచ్చి నెత్తిన కూర్చుంటారు. చనిపోయిన చుట్ట
మిత్రులు, తల్లి తండ్రులు అందర్నీ కలుసుకుంటా

వారితో తనివి తీరా సుఖపడతాడు. తీరని కోరికలువుంటే తీరుతాయి. తాను బ్రతికి వుండగా ఒక స్త్రీ సౌందర్యానికి ముగ్ధుడై ఆమెతో సుఖించాలని ఆశ పడ్డాడనుకో, స్వర్గ లోకంలో ఆమెతో సుఖిస్తాడు. దీనినే కవిత్వంలో చెబితే రంభా సంభోగాదులు అంటారు.

ఇందులో ఇంకొక విశేషం ఉన్నది. మెలకువగా దేహంలో ఉన్న మనస్సుకి కాలమానం వేరు, స్వప్నంలో కాలమానం వేరు, మృత్యువు తరువాత పరిజ్ఞకు కాలమానం వేరు. నిద్రపోతున్న వాడికి కాలిమీద పిన్నుగుచ్చితే క్షణంలో మెలకువ వస్తుంది. పిన్ను గుచ్చాక మెలకువ వచ్చేలోపున ఒక కల వస్తుంది. ఎవరో వెంటపడుతూ ఉంటే తాను పారిపోతూ ఉన్నట్లు, దారినిండా ముళ్లకంచెలు ఉన్నట్లు, చాలా దూరం చాలాసేపు పరిగెత్తి, పరిగెత్తి ముళ్లకంచెలో దూకినట్లు, ముళ్లు గుచ్చుకున్నట్లు కలవచ్చి మెలకువ వస్తుంది. ఇదంతా పిన్నుగుచ్చుకున్న నెప్పికి స్వప్నంలో తర్జుమా! క్షణంలో కొంతభాగం భౌతిక కాలమానంలో ముల్లుగుచ్చు కుంటే ఆ క్షణంలోనే మెలకువ వచ్చే లోపల స్వప్నంలో కొన్ని గంటలు పరుగెత్తుతాడు. అలాగే స్వర్గలోకపు, నరక లోకపు కాలమానాలు వేరు. అందులో ఎవడన్నా తంతూ ఉంటే అతని పూర్వానుభూతి తీవ్రత ననుసరించి నరకంలో కొన్ని సంవత్సరాలు తంతూనే ఉంటాడు. స్మృతుల భీతి తీవ్ర తరమైతే కొన్ని పదుల సంవత్సరాలో, వందల సంవత్సరాలో, వేల సంవత్సరాలో ఆయమభటుడు కత్తులు పెట్టి పొడుస్తూనే ఉంటాడు. అలాగే స్వర్గంలో ఇష్ట జనులతో కొన్ని వేల

సంవత్సరాలు సుఖిస్తూ ఉంటాడు. ఆపేక్షతో పాయసాన్న
బీదలకి పెట్టి, వాళ్లు తింటూ ఉంటే ఆనందించిన స్మృతివల
స్వర్గంలో కొన్ని వేల సంవత్సరాలు మధురాన్నాలు అను
విస్తూ ఉంటాడు. పుణ్యకర్మల వల్ల లభించే పుణ్యలోకాల
ఇది ఒక తరగతి. ఇక బ్రతికి ఉండగానే అనుభవించే గౌర
మర్యాదలు, పేరు ప్రతిష్ఠలు మరియొక తరగతి. ఇదే టూకీ
చెప్పాలంటే స్వర్గనరకాల వృత్తాంతం.

వ్యక్తి : చాలాబావుంది మాస్టారూ! మీరు శా
యంగా వివరించిన అంశాలనే మన పెద్దలు అనుభవంల
వచ్చేటట్లుగా వర్ణించారన్న మాట. వాళ్ళు చేసిన పని ఎ
ప్రతిభావంతమైనదో ఇప్పుడు బోధపడుతున్నది. సూ
మైన ఈ అంశాలను సామాన్యుడికి కూడ అనుభవంలోకి వ
టందుకే ఆ పెద్దల్లలా వర్ణించి ఉంటారని అనిపిస్తోంది.

మాస్టరుగారు : అనిపించడమేమిటి వాళ్ళు చేసిన
అది. సృష్టిలోని ఎన్నో సూక్ష్మాంశాలను శాస్త్రీయంగా
యిబ్బంది పెట్టకుండా మన పెద్దలు పిట్టకథల్లా చెప్
మనలో చాలా మంది ఆ కథల్ని పట్టుకు వ్రేలాడు
ఉంటాం. ఆ పిట్టలేమో ఎగిరిపోతూ ఉంటాయి.

వ్యక్తి : మళ్ళీ మీలాంటి వాళ్ళు ఆ పిట్టల్ని చూ
వరకు అంటే విప్పి చెప్పేవరకు పెద్దల ప్రణాళిక బోధప
మాస్టారూ!

పుత్రుడు – పున్నామనరకం

వ్యక్తి : పుత్రుడు కలిగితే పున్నామ నరకం తప్పుతుంది అంటారు. ఆ విశ్వాసం లోని పరమార్థమేమిటి? మాస్టారూ!

మాస్టరుగారు : జీవుడి పరిణామానికి రెండు మార్గాలు ఉన్నాయి. ఒకటి రాబోయే జన్మ, ఇంకొకటి రాబోయే తరం. అందులో మొదటి దానికి దేవయానమని, రెండవ దానికి పితృయానమని పేర్లు. దేవ యానానికి తన సంస్కారాలు ఉపాధిగా నిలుస్తాయి. పితృయానానికి తన భార్య, గర్భంలో పిండోత్పత్తి ఉపాధిగా నిలుస్తుంది. జీవుని గతికి దేవత లనబడే ప్రజ్ఞలు మార్గము చూపుతారు. పిండోత్పత్తికి పితరు లనబడే దేవతలు మార్గం చూపుతారు. ఈ రెండు మార్గాలలో పురోగతి ఉన్నపుడే నరక బాధలు ఉండవు.

కొన్ని లక్షల సంవత్సరాల నుండి పరిణామంలో ముందుకు నడుస్తూ తెచ్చుకున్న నరజన్మకి దేహంలోని సప్త ధాతువులుగా నిరగ్నులనబడే పితృదేవతలు పనిచేస్తూ ఉంటారు. అందు శుక్రధాతువు ద్వారా ఆ పరిణామానికి ముందు గతి కల్పించటానికి భార్గవులు లేక ఉశనసులు అనబడే పితృదేవతలు సహకరిస్తూ ఉంటారు. వారి ఆశ్రయంలో తన తాత తండ్రులు అంతవరకూ వచ్చిన సంస్కారాల రూపంలో తన యందు వేళ్లాడుతూ ఉంటారు. వారికి రాబోవు గతి భార్య గర్భంలో పిండ ప్రదానం చేస్తే మాత్రమే పుత్రుడు రూపంలో సిద్ధిస్తుంది. అవి లేనపుడు మళ్లీ ఆ వెనకటి తరాల సంస్కారాలన్నీ మట్టిలో, గాలిలో, నీటిలో కలిసిపోతాయి. వైకుంఠ

పాళిలో పాముతోక లాగ మళ్లా అక్కడ నుండి పరిణా
మొదలు పెట్టాలి. దీనినే అధోగతి లేక పున్నామ న
అంటారు.

వ్యక్తి : అయితే మన పూర్వులు మన యందు సంసా
రూపాలను వదలి, తాము తమ పరిణామంలో పైకి
పోతారన్నమాట !

మాస్టరుగారు : ఆహా ! దేవయానంలో వారు ముం
సాగుతూనే ఉంటారు. వారు వదలిన సంస్కార రూ
మన యందు వ్రేళ్లాడుతూ మననుండి రాబోయే తరం కో
వేచి ఉంటాయి. వాటిని వినియోగించుకోలేక పోవ
పున్నామ నరకంగా చెప్పబడింది.

వ్యక్తి : ఇందువల్లనే కాబోలు మాస్టారూ! భారత
జరత్కారునికి తాతముత్తాతలు చెట్టుకు వ్రేలాడుతూ ఉన
కనపడటం, పెళ్లిచేసుకోమని కోరటం అప్పుడు జరత్కా
త్యాన్ని గ్రహించి పెళ్లిచేసుకోవడం, ఇప్పుడు వి
వరిస్తుంటే నా కా జరత్కారువు కథ కళ్లకు కడుతో
మాస్టారూ.

మాస్టరుగారు : ఈ సత్యాన్ని కళ్లకు కట్టేటట్లుగా
డానికే భారతంలో ఆ కథ చెప్పబడింది.

వైతరణి అంటే ?

వ్యక్తి : వైతరణి దాటడం ఉంటుంది అంటారు క
మరి అదేమిటి ? దాని స్వరూపం ఎలా ఉంటుంది ?

మాస్టరుగారు : నిద్రలో ఉన్నవాడికి కాలిలో పిన్ను గుచ్చితే మెలకువ వచ్చే లోపల రూపకల్పన ఆ నెప్పికి జరుగుతుందని చెప్పాను. ఆ రూపకల్పన ఆ వ్యక్తి మేల్కొని ఉన్నపుడు అతనికి నొప్పిని గూర్చి ఉన్న అభిప్రాయాల సమాహారం మీద ఆధారపడి ఉంటుంది. అంతకు ముందు అతనికి ముళ్లకంచెలో నడవడం అలవాటయితే ముళ్లకంచెలో అడుగు వేసినట్లు, ముల్లు గుచ్చుకున్నట్లు కల వస్తుంది. అరి కాలులో వ్రణం వేసి తగ్గిన వాడయితే వ్రణం లేచి బాధ పడుతున్నట్లు కల వస్తుంది. శస్త్ర చికిత్స పొందిన వాడికయితే కత్తులతో ముక్కలు తీస్తున్నట్లు కల వస్తుంది. ఈ రూప కల్పన అతని పూర్వ సంస్కారాల తరగతిని బట్టి ఉంటుంది. ఎక్కువ మంది సంసార జీవులకు కోప తాపాలు, భయము మొదలైనవి కలిగినపుడల్లా రక్తము యొక్క ఉష్ణోగ్రత మొదలైనవి మారుతూ ఉంటాయి. వాటి సంస్కారాల సమాహారం రక్తపు నదిలాగ అనుభవమౌతుంది. దేహం వ్యాధి గ్రస్తమై, రక్తం చెడిపోతే చీము నెత్తురు గూడు కట్టితే వాటి సంస్కారాల మొత్తం చీము నెత్తుళ్ల యేటివలె దుర్గంధాదులతో కనుపిస్తుంది. వాడు లోగడ పొందిన మంట మొదలైన బాధలు ఆ యేటి మీద తేలుతున్న అగ్ని జ్వాలల లాగ, నిప్పుల సుడిగుండాల లాగ అనుభవం తెస్తాయి. నొప్పులు, పీకులు, తీపుల సంస్కారాలు మొసళ్లు, తిమింగిలాలు కరుస్తున్నట్లు, మింగుతూ ఉన్నట్లు కనుపిస్తాయి. వాడు లోగడ పొందిన బాధల తీవ్రతను బట్టి, కాల పరిమి

తిని బట్టి, ఆ యేటిలో ఈదడం యొక్క సాధ్యా సాధ్యాలు రూపింపబడతాయి. ఇతరులకు బాధలు తగ్గించి హృదయ పూర్వకమైన మిత్రి ధర్మాన్ని అనుభవించి సంస్కారంగా పొందిన వానికి తనపైన ఎవరో దయ తలచినట్టు, ఆ నదిలో పడవ ఎక్కించి దాటిస్తున్నట్లు అనుపిస్తుంది. దేహం వదిలాక అనిపించడానికి, జరగడానికి భేదం లేదు గనుక పరహిత జీవులకు ఈ మొత్తం శాస్త్రీయ సత్యం. కనుకనే శాస్త్ర పురాణ గ్రింథాల్లో ఇది సత్యంగా వర్ణింపబడింది.

నరక బాధల నుండి విముక్తి పొందడ మెలా ?

వ్యక్తి : మాస్టరుగారూ! శరీరం విడిచాక ముందుగ దుఃఖాన్ని కలిగించే స్మృతులు యమలోకాన్ని సృష్టిస్తాయి అవన్నీ అనుభవించాక అప్పుడు మంచి స్మృతులు స్వ సౌఖ్యాలను సృష్టిస్తాయని చెప్పారు. ఈ విధంగా స్మృతు వలన ఇబ్బంది పడకుండా దేహంలో ఉన్నప్పుడు, దేహ విడిచాక కూడా ప్రిశాంతంగా హాయిగా ఉండాలి అం మానవుడు అనుసరించవలసిన మార్గము లేమిటి?

మాస్టరుగారు : దేహంలో ఉన్నప్పుడు, దేహం విడి వెనుక సుఖశాంతులతో ఉండగలగడాన్నే ఇహ సౌఖ్యాలు అన్నారు. ఇవి సిద్ధించాలంటే ఏం చేయాలో చె డానికే ఋషి ప్రోక్తమైన సకల ప్రిమాణ గ్రింథాలు నాయి. ఆ కర్తవ్యాన్నే ధర్మాచరణ మన్నారు. దానిని పాదించినవే వేదాలు, ఉపనిషత్తులు పురాణేతిహాసా ఆహార, విహార, నిద్రా దాంపత్యాది విషయాలలో

ంతుడై ప్రవర్తించడం, దేశకాల పాత్రలను వివేకంతో
రిగి మెలగడం, దాన ధర్మాది సత్కర్మ లాచరించడం,
భూతదయ, మొదలైన మార్గాలతో నలుగురితో మంచిగా
ప్రతికి మెప్పులతో సుఖాలు పొందడం, సత్సాంగత్యంతో
ఉన్నత కక్ష్యలో నిలబడటం, నాలుగాశ్రమాల ధర్మాలు
నిర్వర్తించడం, ఉపనయన వివాహాది సంస్కారాలతో పశు
త్వం నుండి కాపాడుకుంటూ సుఖాలు అనుభవించడం,
ఇంద్రియాలు, మనస్సు తన వశంలో ఉంచుకోవడం, హింసా
బుద్ధి లేకుండా పరోపకారంతో బ్రతకడం, వీటివల్ల వచ్చే
సంస్కారాలతో కూడిన సునాయాస దేహత్యాగం, మళ్లా
ఉత్తమ జన్మ పొందడం, ఈ మొత్తానికి సారాంశం. ఈ
మార్గానికి భిన్నంగా నడుచుకోవడం వల్లనే పైన చెప్పిన
దుర్మరణాలు, యమలోక బాధలు కలుగుతాయి. వేదాలలో
శాసనరూపంలో చెప్పినా, ఉపనిషత్తులు, పురాణాలలో
మిత్ర ధర్మంగా చెప్పినా, కావ్య మార్గంలో ప్రియురాలు
చెప్పినట్లు చెప్పినా, అందలి అర్థవాదాలు, కథలు, కమా
మీషలు ప్రతిపాదించేది ఇంతకన్నా వేరే ఏమీ లేదు. ఈ
మార్గాన్ని అవలంబించిన వారిని వేద మార్గగులని, ఆర్యులని
అంటారు. తప్పి త్రిప్పలు పడుతూ సుఖంకోసం వెతుకులాడు
కుంటూ, ఇంద్రియాల వెంట, ఆస్తిపాస్తుల వెంట, మత రాజ
కీయాల వెంట, కోర్టుల వెంట తిరుగుతూ సుఖపడటానికి
నోచుకోకుండా చచ్చేవారిని మ్లేచ్ఛులు అన్నారు. వారినే
వేద బాహ్యులు అన్నారు. వారి సాంగత్యం వల్ల సుఖజీవనం
కలిగించే వేద మార్గం నుండి దృష్టి చెదరడానికి అవకాశం

ఉంది గనుక అలాంటి వారిని పూర్వులు అస్పృశ్యులుగా భావించేవారు.

వ్యక్తి : మానవులకు శాంతియుత సుఖ జీవనాన్ని సిద్ధించేటట్లు చేయటానికి మన పెద్దలు చేసిన కృషి తల్చుకున్నప్పుడు ఆశ్చర్యానందాలతో వారికి చేయెత్తి నమస్కరించడం తప్ప వారికి మనం ఏం చేయగలం? వారి ఋణం ఎలా తీర్చుకోగలం?

మాస్టరుగారు : వారు నడిచినట్లు నడిచి పదిమందికీ ఆ మార్గాన్ని విప్పి చెప్పి వారి జీవితాలను కూడ సుఖశాంతులతో నిండేటట్లు చేయగలిగితే మనం ఆ పెద్దల ఋణాన్ని తీర్చుకున్నవాళ్ళం అవుతాం. వారెందుకు కృషి చేశారో దర్శించి ఆ కృషిని వివేకంతో సద్వినియోగ పరుచుకోనడమే మనం చేయగలిగింది, చేయవలసింది.

యముని నిజస్వరూపం

వ్యక్తి : మాస్టరుగారూ! మనం సంప్రదాయంలో యముడు, యమధర్మరాజు అంటారు కదా! అతని స్వరూప భావాలేమిటి? సృష్టిలో నున్న ఒకానొక తత్వానికి యముడని నామకరణం చేశారు అనిపిస్తుంది. ఆ తత్వం ఏమిటో మీ లాంటివాళ్ళే వివరించి చెప్పాలి.

మాస్టరుగారు : మానవజన్మకు పశుకామం, ఇంద్రియ లోలత, ఈర్ష్యాసూయాదులు పరిణామం యొక్క అసంపూర్ణతకు లక్షణాలు. దాని సంపూర్ణతను ఆర్జించుకొనడానికి

మానవుడు తన్ను తాను కాలానికి, ప్రకృతికి విడిచి పెట్టి చూస్తూ ఉండనక్కర్లేదు. జంతువులకి, చెట్లకి పరిణామం పూర్తిగా ప్రకృతి కార్యక్రమంలో ఇమిడి ఉంటుంది. ప్రకృతి తెచ్చిన పరిణామానికి ఫలితమే మానవుడు. ఆ ప్రకృతే మానవుడికి వివేకం అనే శక్తిని ప్రసాదించింది. దాన్ని వినియోగించుకోనడం మొదలు పెట్టిన దశనుండి ప్రకృతి అతని పరిణామాన్ని క్రమంగా అతనికే వదిలి వేస్తుంది. కనుక మానవుడు జంతువులను చూచి తనకు కూడా భవిష్యత్పరిణామాన్ని ప్రకృతి చేకూర్చాలని చతికిలబడి కూర్చుంటే అధోగతే కాని పురోగతి ఉండదు. అలా కూర్చోనీయకుండా ముల్లు కర్రతో పొడవడానికి ఆ ప్రకృతే వాడికి కర్మ ఫలాన్ని ఏర్పాటు చేసింది. జంతువులు మొదలైన వాటికి కర్మ ఫలం లేదు. కారణం ఏమంటే అవి చేసే పనులకి ఆకలి దప్పులు మొదలైన ప్రకృతి గుణాలే కారణం గాని అభిప్రాయాలు, ఆశయాలు కావు. అభిప్రాయాలు, ఆశయాలు ఉండటం వల్ల మానవుడికి కర్మఫలాలుంటాయి. చెడ్డ కర్మకి బాధాకరమైన ఫలితం ఉంటుంది. జంతువులకు అప్పుచేయడం ఉండదు కనుక అప్పుల వాళ్ళ బాధలు లేవు. నరుడు అప్పు చేసినా, తప్పుచేసినా ఇతరుల చేత దండింప బడతాడు. అంటే నరుడితోనే నరుడికి కర్మ ఫలాలును అనుభవింప చేస్తుంది ప్రకృతి. ఇలాంటి దుష్కర్మ ఫలితాలు శిక్షలుగా పనిచేసి శిక్షణ వైపుకి మనస్సుని మరలిస్తాయి. దీనినే యమించడం లేక యమము అంటారు. దీని వలన అపరిపూర్ణత నుండి క్షాళన పొంది

నరుడు పరిపూర్ణతలోనికి పయనిస్తాడు. ఇక్కడ వివేకాన్ని ఉపయోగించుకున్న వాడికి అనేక జన్మల పరిణామం ఒక జన్మలోనే జరుగుతుంది. నర ప్రకృతిలోని. ఈ, "యమించే" సామర్థ్యాన్నే యముడు లేక ధర్మరాజు అంటారు. వివిధ కర్మ ఫలాలే యమలోకంలో బాధలు.

చిత్రగుప్తుని కథ.

వ్యక్తి : చాలా చక్కగా బోధపడింది మాస్టారూ! మరి చిత్రగుప్తుడంటే ఏమిటో? ఆ తత్వంలో ఉన్న చిత్రమేమిటో కూడా వివరించి చెప్పండి?

మాస్టరుగారు : జ్ఞప్తి ఉన్నా లేకపోయినా అప్పులవాడు అన్నరోజుకు వచ్చి కనబడుతాడు. మనకు జ్ఞప్తి ఉండడం లేక పోవడంతో వాడికి సంబంధం లేదు. రుచిగా ఉన్నదని మరి యొక పెసరట్టు ఎక్కువతిని మర్చిపోతే అది మర్చిపోదు. సకాలంలో అజీర్ణవ్యాధి వస్తుంది. మన జ్ఞప్తితో సంబంధం లేక ఇలా వేచియుండి కాలబద్ధంగా పనిచేసే ఫలనిర్ణయం ఒక పద్దులాగ దాచబడివుంటుంది. కావలసిన తేదీన పద్దు తిరగ చేసి వసూలు చేసినట్లు పనిచేసే ఈ సామర్థ్యాన్నే చిత్రగుప్తుడంటారు. చిత్రంగా మనకు అంతుపట్టని విధంలో గోప్యం చేసిఉంచి ఫలానుభవాన్ని నిర్ణయం చేయడమని ఈ చిత్రగుప్తుడనే పదానికి అర్థం.

యముడు, చిత్రగుప్తుడు సర్వకాలాల్లో, సర్వమానవుల మీద పనిచేస్తూ పరిపూర్ణతకు దారితీస్తారు. అది బాధాకరంగా వుంటుంది గనుక వారిద్దరూ భయంకరులుగా వర్ణింప

బడ్డారు. సత్కర్మలాచరించేవాడికి సత్ఫలితాలు అనుభవానికి వచ్చి ఊర్ధ్వగతికి దారితీస్తాయిగనుక పుణ్యాత్ములకు యముడు సుందర, సుకుమార రూపంలో దర్శనమిచ్చి వరాలిస్తాడని కాశీ ఖండంలో శివశర్మోపాఖ్యానము చెబుతుంది.

వ్యక్తి: చాలాబాగుంది మాస్టారు! యముడు, చిత్రగుప్తుడు కేవలం యమలోకంలో దర్శనం ఇచ్చేవాళ్ళు కాదని, మానవులను మంచి మార్గంవైపు మలచేటందుకై నిరంతరం పనిచేసే దివ్యమూర్తులని బోధపడింది. ఇలా బోధపరుచుకుంటున్న కొద్దీ మన సంప్రదాయంలోని దేవతామూర్తుల స్వస్వరూపాలు నిత్యజీవితంలో అనుభవంలోకి రాగలవని అనిపిస్తోంది.

మాస్టరుగారు : ఒకసారి ఆ దేవతల నిజస్వరూపాలు బోధపడాలేగాని ఆ పైన వారు అడుగడుగునా సాక్షాత్కరిస్తూనే ఉంటారు. సృష్టి దేవతలతో నిండియున్నట్లుగా మన జీవితం కూడా దేవతలచే నిండియున్నదని, నిర్వహింపబడుతోందని అనుభవంలోకి వస్తుంది.

దున్నపోతే యమవాహనం ఎందుకయింది ?

వ్యక్తి : యముడి వాహనం దున్నపోతు అంటారు గదా! యమునికి, దున్నపోతుకి సంబంధం ఏమైనావున్నదా మాస్టారూ

మాస్టరుగారు : దున్నపోతుకి, యముడికి వున్న సంబంధం తెలియడానికి ఆధారాలేమీలేవు. ఎక్కువ మందికి అనుభవాన్ని బట్టి ఒక చిన్న సామ్యం కనిపిస్తుంది. దున్నపోతు కలలోకి వచ్చి వెంటపడినట్లు, తరుముతూ ఉన్నట్లు కనిపించి

స్వప్నంలో భయం కలిగితే మాత్రం తానో, తన ఆప్తులో చనిపోవడం గాని, జబ్బుచేసి చనిపోయి నంతపని జరగడం గాని అవుతుంది. ఇది నూటికి ఎనభై మంది విషయంలో సత్యం. దున్నపోతులు లేని తెల్లదేశాలలో ఈ స్వప్నం వైఖరి ఎలా ఉంటుందో చెప్పలేం గాని ఉన్న దేశాలన్నిట్టిలో ఈ సత్యం వర్తిస్తుంది. దీన్ని గమనించి పూర్వులేమైనా దున్నపోతుని యముని వాహనంగా చేశారేమోగాని చెప్ప లేము.

యమపాశం :

వ్యక్తి : మరి యముని చేతిలో కాలపాశం ఉంటుందంటారు. అదేమిటి మాస్టారూ ?

మాస్టరుగారు : పాశం అంటే తాడు. దానితో ఉచ్చు వేస్తే జీవుడు యముడికి పట్టుబతాడని పురాణాలు చెపు తున్నాయి. బహుశా వురిపోసుకోనడానికి, శ్వాసగతులు నిరోధం కావడానికి వున్న సన్నిహితత్వం ఈ సంకేతానికి కారణం కావచ్చు. చనిపోబోతూ వుండగా చాలామందికి శ్వాసబిగదీయడం, గాలి పీలుద్దామన్నా సాధ్యపడక పోవడం, ఉక్కిరి బిక్కిరి వుంటాయి. కొందరికి కంఠగతములైన కఫ గాతములు, గురక కూడ ఉంటాయి. అప్పుడు జీవుడు పడే బాధకి చిహ్నంగా యముని ఉరి తాడు పుట్టి వుండవచ్చు.

ఇంద్రుని నిజరూపం :

వ్యక్తి : మన పురాణాల్లో, ఇతర గ్రంథాల్లో యమలోకం ఉన్నట్లే, ఇంద్రలోకం కూడా ఉన్నట్లు వర్ణించారు కదా!

ఇంద్రుడు దేవతలకు నాయకుడని, దేవతలతని పరివారమని, బృహస్పతి అతని గురువని రకరకాల కథలు చెపుతారు కదా, మరి ఈ ఇంద్రుడి కథ ఏమిటి ?

మాస్టరుగారు : ఇంద్రియ ప్రవృత్తులు స్వతంత్రాలుకావు. మనస్సుమీద ఆధారపడి ఉంటాయి. మనస్సులో ఏర్పడిన ఇంద్రియాల కేంద్రమైన ప్రజ్ఞనే ఇంద్రుడిగా వర్ణించారు. ఇంద్రియాలద్వారా మనస్సు సుఖానుభవం పొందుతుంది గనుక ఇంద్రుడు భోగాలకు అధిపతి. శరీరంలోని భౌతిక ధాతువులను పరిపాలించేవి ఇంద్రియాలు కనుక దేహంపైన అవి అధికారం కలవి. వానిపైన అధికారం గలది మనస్సు, దానిపైన అధికారం గలది బుద్ధి, కనుక బుద్ధికి అధిదేవత అయిన బృహస్పతి ఇంద్రుడికి గురువన్నారు. మనస్సుకిగల పైచెప్పిన ఆధిపత్యం మీదనే సామర్థ్యం ఆధారపడి ఉంటుంది. కనుక సమర్థుడైన వాడిచుట్టూ ఆశ్రయించుకొని మిగిలినవారు చేరతారు. దీనిని బట్టి ఇంద్రుడంటే నాయకుడని కూడా అర్థం వచ్చింది. పరిపాలించే వాడిని నరేంద్రుడంటారు. కాలక్రమాన శ్రేష్టమనే అర్థం కూడా వచ్చింది. జంతువులలో శ్రేష్టము, సమర్థము అయిన దానిని మృగేంద్రుడని మొదలైన అర్థాలు వచ్చాయి. ఇలాగే ఆకాశంలో శక్తులను కూడగట్టుకునే ప్రజ్ఞ ఇంద్రుడుగా వేదాలలో చెప్పబడినది. పురాణాలలో మాత్రం ఇంద్రియాలద్వారా సమస్త భోగాలని అనుభవించే మనస్సుకు అధిదేవతగానే ఇంద్రుడు ఎక్కువగా వర్ణింపబడ్డాడు. వాడిచుట్టూ ఆక్రమించుకొని ఉన్న ఇంద్రియాది ప్రజ్ఞలు వాడి దేవతా పరివారంగా చెప్పబడ్డారు.

వ్యక్తి: అయితే మాస్టరుగారూ! ఇంద్రుణ్ణి సహ
స్రాక్షుడు అంటారు గదా! మరి ఈ వేయి కన్నుల కథ
ఏమిటి?

మాస్టరుగారు: సృష్టికి కేంద్రంగా పనిచేస్తూ ఉన్న
సూర్యుని విషయంలో ఇంద్రుని వేయికన్నుల కథ పుట్టింది.
కిరణాలే కన్నులుగా వర్ణించడం సమంజసమైన, శాస్త్రీయ
మైన వేదవాఙ్మయకవి సమయం. అహస్సు (పగలు)ని
తనలో లీనం చేసుకున్న రాత్రిని అహల్యగా వర్ణించడం,
సూర్యోదయంతో ఆమెను జరింప చేసిన సూర్యుడు అహల్యా
జారుడనడం, వాని వంటి నిండా కన్నులుగా కిరణాలు ఏర్పడి
నాయనడం వేద పురాణం కవిసమయం.

వాల్మీకి రామాయణంతో వేదవాఙ్మయం నుండి మొద
టిగా ఈ కథ లోకవాఙ్మయం లోనికి దిగి వచ్చింది. కాని
వాల్మీకి రామాయణంలో క్రొత్తగా గౌతము డొకడు
అహల్యను పెళ్ళి చేసుకుంటాడు. గౌ+తమ: అనగా భూమికి
ఉత్తమ సంతోషదాయకుడు లేక చంద్రుడని అర్థం. కుముద
అన్న మాటకు ఏ అర్థం చంద్రుడుగా సూచిస్తున్నదో
గౌతమ అన్న మాటకు కూడ అదే. అతడు అహల్యకు
భర్త అనగా చంద్రుడు రాత్రిని పరిపాలించే వాడని అర్థం.
అతడు తపస్సుకి పశ్చిమ దిక్కుగా వెళ్ళిపోయిన తరువాత
ఇంద్రుడు అహల్యను జరింప చేశాడంటే పూర్ణిమనాడు
చంద్రుడు పడమటకు దిగిపోతూఉంటే సూర్యుడు తూర్పున
ఉదయించి రాత్రిని జరింప చేస్తాడు. జారుడు అనగా జరింప

చేయువాడు లేక జీర్ణింప చేయువాడు అని ఒక అర్థం. శీల ధర్మాన్ని చెడగొట్టే వాడని ఇంకో అర్థం. ఇంద్రుడు కోడి పుంజుగా మారి ఇల్లెక్కి కూశాడని కూడా కథ ఉంది. సూర్యుడు కోడిలాగా మేల్కొలిపే కాలాన్ని తెలుపు తాడని అర్థం. ఇంతకీ గౌతముడి ప్రతిరూపంగానే ఇంద్రుడు వచ్చాడట. సూర్య చంద్రులు యిద్దరు వెలుగుతో కూడిన బింబాల రూపాలే అని అర్థం. వాల్మీకి రామాయణంలో మాత్రం వేదంలోలాగ కాక ఇంద్రుడు పొందిన శాపం మరోలాగ ఉంది. ఇంద్రుడు బీజాలు తెగి భూమి మీద పడవలెనని గౌతముడు శపించినట్లు ఉంది. సూర్యోదయం కారణంగా సూర్య కిరణాలు భూమి మీద పడి దివ్యత్వాన్ని కోల్పోయి భూమిపై సృష్టి కారణాలైనాయని దీనికి అర్థం. శాపం తరువాత ఇంద్రుడు దేవతలను యాచింపగా వారం దరు నానా తిప్పలు పడి మేషాండం తెచ్చి ఇంద్రునికి బీజంగా అతికించారని వాల్మీకి వ్రాశాడు. అంటే సూర్యుడు సంవత్సరమంతా సంచారం చేసి తన తేజస్సును శీతాకాలంలో కోల్పోయి మరల సంవత్సరాదిలో మేషరాశితో ప్రవేశించి మళ్ళీ వీర్యవంతుడై వసంతఋతువు కలిగించి సృష్టికి ఉత్తేజం ఇస్తాడని, అలా దిగివచ్చిన కిరణాల మార్గమే సూర్యవంశ మని, దానికి కవి సమయంగా రాముడు చైత్రమాసంలో పుట్టాడని, విన్యాసం చేయబడ్డది. చెప్పదలచిన విషయాన్ని ఇలా కథలోకి మలచి ఒకప్పుడు జరిగిన రాముడను చక్రవర్తి కథలో పొదిగి ఇచ్చే పద్ధతినే వేదార్థ ప్రతిపాదనం అంటారు.

వేదాలలో, పురాణాలలో కూడా భూమి
కిరణాల రూపంలో సృష్టిగా దిగివచ్చే దైవ
అను పేరు వాడబడినది. క్రిందికి ఊడిపడిన
వాడని దీనికి అర్థము. దీనికి కావ్యమార్గ వి
వ్రాసిన ఇంద్రుని కథ. కాగా పదాలలో
లకు మాత్రం విష్ణువు, ఇంద్రుడు, రుద్రు
దైవాలుగా కథలు అల్లించుకున్నారు. ఇవే
ర్థంలో వాడబడినపుడు ఇంద్రుడు, రుద్రుడు,
ర్యామి యొక్క వేరు వేరు ధర్మాలే గాని,
కారు.

వ్యక్తి : ఈనాడు ఇంత వివరంగా ఇం
మీరు వివరించటంతో ఇంద్రుడంటే మా
అభిప్రాయాలన్నీ కూకటి వేళ్ళతో పెళ్ళ
ఇంతటి విలువైన సత్యాలను తెలుసుకోలేక
పట్టుకొని హేళన చేస్తూ ఉండే వాళ్ళం.
వేదార్థం లేకపోతే ఈ కథలు ఇన్ని యుగ
నిలిచి ఉంటాయని ఇప్పుడనిపిస్తోంది. ఇలా
మీలాంటి పెద్దల దగ్గర శుశ్రూష చేసి గ్ర
గాంతగా చదువుకుంటే సత్యం బోధపడక
అభిప్రాయాలు ఏర్పడటానికి అవకాశం
చల్లగా చూస్తే మీకు దగ్గరలో ఉంటూ
హాసాలలోని ఇలాంటి పొడుపు కథలన్నీ
కోవాలని ఉంది.

---

# C. పితృకర్మల పరమార్థం

కర్మలవలన పితరులకు మేలు జరుగుతుందా ?

వ్యక్తి: ఒక వ్యక్తి చనిపోయిన తరువాత నిత్యకర్మ మొదలైనవి చేస్తారుగదా! వీటిని చేయడంవల్ల ఆ పోయినవాళ్ళకు నిజంగా మేలు జరుగుతుందా ? ఒకవేళ ఆచరించకపోతే పోయినవాళ్ళేమైనా ఇబ్బందుల పాలవుతారా! మనం ఆచరించే ఈ పితృకర్మలకు పరమార్థం ఏమిటి ? వీటినిగూర్చి రకరకాల భావనలు లోకంలో ఉన్నాయి. సర్వజ్ఞులైన మీరు వివరించి చెబితే మా సంశయం తొలగిపోతుంది.

మాస్టరుగారు : ఇందులో విషయాలు విప్పిచెప్పడం కొంతమందికి అంత మంచిదికాదు. అది కొంతవరకు తప్పే అయినా విప్పిచెపుతాను. పోయినవాళ్ళకి కలగవలసిన ఉత్తమ గతులో, అధోగతులో వారు ఆచరించిన కర్మలను బట్టి ఉంటాయి గాని వారి పుత్రులో, దత్తపుత్రులో ఆ పది రోజులు ఆచరించే కర్మలను బట్టి మారవు. అపరకర్మకాండలో రెండు భాగాలు ఉన్నాయి. (1) వేదమంత్రాలు. (2) కల్పం వాక్యాలు. ఈ రెండు వేరే వేరే గ్రంథాలు. వేదమంత్రాలు ప్రాచీనమైనవి. కల్పాలు బోధాయన, అశ్వలాయనాది ఋషుల కాలం లోనివి. వాళ్ళు కల్పవాక్యాలతో వేదమంత్రాలను కూర్పు చేసుకున్నారు. ఈ కూర్పు మంత్ర ద్రష్టలకు సంబంధించినది కాదు. అంటే తక్కువ రకమని అర్థంకాదు.

వేద మంత్రాల్లో ఉన్న విషయం పితృదేవతలకి, పిండోత్పత్తికి సంబంధించిన విషయం, అనగా జీవులకు గర్భధారణం

గర్భపిండవృద్ధి, గర్భస్థ జీవుని సత్సంస్కారయుతునిగా చేయడం అనే జగత్కర్మకు సంబంధించిన దేవతలు పితృదేవతలలో ఒక తెగవారు. వీరు చంద్రకిరణాలయొక్క, చంద్రకళలయొక్క పరిభావం రూపంలో భూమి జీవులపై పనిచేస్తూ ఉంటారు. శనగగింజ నానవేస్తే తొలకల్లే మొక్క బయటికి వస్తుంది. దాని నిర్మాణానికి, వృద్ధికి, జలములయందు, జలములపై ఆధిపత్యము వహించే చంద్రునియందు, ఉన్న పితృదేవతలు పనిచేస్తూ ఉంటారు. అలాగే గర్భధారణాదుల విషయంలో కూడ పనిచేస్తూ ఉంటారు. ఈ ప్రజాసర్గకార్యక్రమానికి సంబంధించినవే అపరకర్మకాండలో ఉపయోగించే మంత్రాలు. వానిని భోక్తలపూజతో జోడించి చేసిన క్రతువు వలన కర్త ఇంటికి, వారి చనిపోయిన పెద్దలు సంతానంగా దిగి రావడానికి సంస్కార పూర్వకమైన, అంగీకారరూపమైన మార్గం ఏర్పడుతుంది. ఇంతవరకు అపరకర్మకాండలోగాని, ఆబ్దిక మంత్రాలలోగాని, అమావాస్యనాడు పితృతర్పణ విషయంలోగాని యిమిడివున్న శాస్త్రీయమైన విధానం

ఇక రెండవభాగం. కర్త, వాని బంధువులు, ఆత్మీయులు పోయినందువలన పొందే శోకతాపాదులు తగ్గించుకోమంటే తగ్గేవి కావు. అవి తగ్గటానికి వారిలో నున్న రాగద్వేషాలలోకానికి కొంత పని కల్పించాలి. దానికోసమే పరేతకు ఆవాహనచేసినట్లు, తాపం తగ్గటానికి స్నానాలు చేయిస్తున్నట్లు, అర్చన పూజనాదులు ఉంటాయి. సన్నిహిత రక్తసంబంధము కలవారు చనిపోయినపుడు మానసిక బాధ మాత్రమేకాక వేరే కొంత తాపం అనిర్వాచనీయంగా ఏర్పడు

తుంది. ముఖ్యంగా తల్లిదండ్రుల, అన్నదమ్ముల శరీర దహనం జరుగుతూ ఉన్నపుడు తమ శరీరంలో కొంత వేదన కలుగుతుంది. ఇది కొందరు విషయం తెలియకపోయినా అనుభవించడం కూడా అనుభవ సిద్ధమే. దూర దేశంలో వున్న తన కొడుకు చనిపోతూవున్న సమయంలో ఒకామెకు బొడ్డుదగ్గర విపరీతమైన వేదన కలిగింది. తల్లి దేహం దహనం చేస్తున్న సమయంలో ఆ వార్త తెలియని దూర దేశంలో ఉన్న కొడుకు ఒళ్ళంతా మంటలు, మంటలు అని స్నానం చేయటం మేమెరుగుదుము. ఇలాంటి బాధలు ఉపశమనం కావాలంటే శాస్త్రీయమైన మార్గాలు నవీనశాస్త్రాల్లో లేవు. ఇంతవరకు మానవుడు కనిపెట్టిన వైద్యశాస్త్రము ఇక్కడ అక్కరకురాదు. దీన్ని గూర్చిన సరియైన శాస్త్రీయ తాపోపశమన విధానం ఈ కర్మకాండలోని కల్పంలో వుంది. అది చేస్తే ఈ తాపం ఎందుకు తగ్గుతుంది ? అన్న ప్రశ్నకు ఒక్కటే సమాధానం. ఈ మందులు పుచ్చుకుంటే ఈ రోగాలు ఎందుకు తగ్గుతున్నాయి. దీన్ని వివరించగలిగితే దాన్ని వివరించగలగవచ్చు. వివరించలేకపోయినందువల్ల శాస్త్రంకాదు అంటే ఆ లోపం వైద్య శాస్త్రానికి కూడా సంక్రమించవలసి ఉంటుంది.

మరొక ముఖ్య విషయం. ఎంత పామండుడికైనా భూతదయ, దానబుద్ధి, సత్ప్రవర్తన అంటించవలెనంటే ఇంతకన్నా సరియైన సమయం దొరకదు. చనిపోయిన వారి యందు ఆర్ద్రమైయున్న మనస్సుకి దాన ధర్మాలు నేర్పాలంటే ఇవి మీ చనిపోయిన వాడికి చెందుతాయి అని చెప్పాలి. ఎంత విద్యావంతుడికైనా ముముక్షు ధర్మ విశారదుడికి తప్ప

భయాదులు పోవు. చదివిన వారిలోను, చదవని వారిలోను, భయపాశాలున్న వారి సంఖ్య ఎక్కువ. చనిపోయిన తమ బంధువులు బాధపడతారనే భయాన్ని చూపి దాన ధర్మాలు చేయించడం ఈ కల్పంలో ఇమిడి ఉంది. కనుకనే దీనిని విప్పి చెప్పడం అంతమంచిదికాదు అన్నాను. ఇది తెలుసుకున్నవారు కూడ పామరులకు విప్పిచెప్పడం వల్ల అపకారం, చెప్పక పోవడంవల్ల ఉపకారం జరుగుతుంది. ఇక తెలుసుకున్న వారి విషయం వారి యిష్టం మీద, దైవ నిర్ణయంమీద ఆధారపడి ఉంటుంది.

వ్యక్తి : ఇన్ని సత్యాలను కరతలామలకం చేసుకున్న మీరు మీ తండ్రిగారు దేహాన్ని విడిచినపుడు పితృకర్మ విధానాన్ని ఎంతటి శ్రద్ధాభక్తులతో, ఎంతటి దీక్షతో ఆచరించారో మేం కళ్లారా చూశాం. వాటిని అనుష్ఠానం చేస్తున్నపుడు మిమ్మల్ని చూస్తున్నమాకు పితృకర్మ నిర్వహణ ఎంత పవిత్రమైనదో బోధపడినది. దీక్షతో ఈ ర్మలను అనుష్ఠించే వారికి ఎంతటి తృప్తి, పరిపూర్ణత, భిస్తాయో అప్పటి మీ మూర్తిలో మాకు దర్శనమిచ్చింది. న సంప్రదాయంలో పెద్దలు దర్శించి యిచ్చిన కర్మకాండలన్నీ మానవుడిని సంస్కరించి అతని హృదయాన్ని విశాలమొనర్చి ముక్తజీవిగా మలచేటందుకేనని మీ సాన్నిధ్యంలో ఉంటున్న మాకు అడుగడుగునా బోధపడుతూనే ఉంది. మీ అడుగుజాడలే మాకు వెలుగుదారులు. మీ వాక్కు చెవిని సోకినవాడు కర్తవ్యంలోనికి మేల్కొనటమేగాని, కర్తవ్యం నుండి పక్కకు తప్పుకోవడం అనేది సాధ్యమయ్యే పనికాదని

మా అనుభవం. కనుక మీరిచ్చిన వివరణ మమ్మల్ని మరింత వికసింపచేస్తుంది. మా నుండి ఈ దర్శనాన్ని పొందే వాళ్ళు కూడ తప్పకుండా మానసికంగా మరింత వికసించి ధర్మాచరణకు అంకితమయ్యే వాళ్ళే అయి ఉంటారు.

పిండాలు కాకులకే పెట్టాలా ?

వ్యక్తి : మాస్టారూ! పిండాలు కాకులకు పెడుతూ ఉంటారు కదా! కాకులకు మాత్రమే పెట్టాలనే నియమం ఏమైనా ఉందా? కాకులకు పెట్టడంలో విశేషం ఏమైనా ఉన్నదా?

మాస్టరుగారు : కాకులకే పిండాలు పెట్టాలనే నియమం కల్పంలో ఎక్కడా లేదు. మంత్రంలో కాకుల ప్రసక్తే లేదు. కల్పంలో గృధ్రి, వాయస, జలచరాదులు తినాలి అని వుంది. ఆరోగ్య శాస్త్రాన్ననుసరించి పూర్వం రోజుల్లో దహనంగాని, కర్మకాండ గాని ఊరి వెలుపల నదీ తీరాన, కాలువ ఒడ్డున, లేక చెరువు ఆవతలి గట్టున చేయమని నియమం. అక్కడ పెట్టిన పిండాన్ని తినిపోయే జీవులు ముఖ్యంగా గృధ్ర, వాయస, జలచరాలు అని చెప్పబడ్డాయి. అపరిశుద్ధ భావాలకు గురైన కుక్క, నక్క, పంది తినకూడదు. గోవు తినవచ్చు.

ఇక్కడ ఒక చిన్న విశేషం. రంగుని, రూపాన్ని బట్టి, కంఠధ్వనిని, శకునాన్ని బట్టి, శరీర భాగాలను పీక్కు తిన

డాన్ని బట్టి, నిర్జీవ దేహభాగాలను త్వరగా ప్రకృతి
కలిపివేసే శక్తిస్వరూపంగా కాకి గుర్తింప బడింది. కను
కల్పంలో కాకి యమదూతగా వర్ణింపబడింది. దీనిని బ
పరేత కాకి రూపంలో వచ్చి తింటాడనే నమ్మకం ఏర్పడ
చనిపోయిన వాని జీవప్రజ్ఞ ఊర్ధ్వగతికి పోయే లోపు
సమీప విహంగాలను ఆవేశించి ఉండటం సహజం. కను
ఆ జీవి కోర్కెలకు తాత్కాలిక ప్రతిబింబంగా ఈ
ఇష్టా యిష్టాలు పనిచేస్తాయి.

వ్యక్తి : అయితే పోయిన వారు కాకిని ఆవేశించి ఇ
మైతే ముట్టుకోవడం, ఇష్టం లేకపోతే చేరకపోవడం,
బంధువులు తప్పు వొప్పుకొని నమస్కరిస్తే వచ్చి తినడ
ఇవన్నీ నిజమే నన్నమాట.

మైలపట్టడ మెందుకు ?

వ్యక్తి : మాస్టరుగారూ ! బంధువులు పోయినపుడు మై
పడుతూ ఉంటారు కదా ! ఈ మైల పట్టడం శాస్త్రీయమేనా
దీన్ని పాటించడం అవసరమే నంటారా ?

మాస్టరుగారు : మైల యొక్క శాస్త్రీయత అశౌచ
అన్న పదంలోనే ఉంది. చనిపోయిన వారి బంధువులు శో
మగ్నులై ఉండగా స్థూల సూక్ష్మ మలాలన్నీ శరీరం నుం
ముమ్మరంగా వెలువడతాయి. రోదనలో కంటి వెంట
ముక్కు వెంట నీరు ప్రత్యక్షమై, విషయం తెలియకపోయినా
దుఃఖితుల ఇంటిలోకి వెళ్లి వస్తే మనస్సు వికాసం తగ్గుతుంది

క వాతావరణం వాయురూపాలు, భావరూపాలు అయిన మలాలతో నిండి యుండటమే దీనికి కారణం. మంచి సహవాసాలు చెడ్డ సహవాసాలు, మనిషిని ప్రభావితుణ్ణి చేయడం భౌతికం అనలేం కదా! అది సూక్ష్మ మల సంసర్గంవల్ల కలుగుతుంది. అలాగే దుఃఖితుల సంసర్గం ప్రభావం కూడా. దాని వలన వారు ధరించిన దుస్తులు, వాడిన వస్తువులు కూడ ఇతరులకు సూక్ష్మ మలాలను సంక్రమింప చేస్తాయి. ఇది ఇతరులకు బాధ కలిగించకుండా జాగ్రత్తపడటమే మైల పట్టడం.

మైలలో మంత్రోపాసన.........

వ్యక్తి : మైలలో మంత్రోపాసన చేయవచ్చునా! దేవుడు, పూజలు ఇవేమీ పనికిరావంటారు. నిజమేనా మాస్టారూ! అలాగే సంవత్సర సూతకం ఉంటుందని ఆ సంవత్సరంలో పుణ్య క్షేత్రాలు వెళ్లకూడదని, దేవుడి గుళ్లలో ప్రవేశించ కూడదని ఆంక్షలు పెడతారు. ఇవన్నీ ఎంతవరకు నిజం మాస్టారూ?

మాస్టరుగారు : ఇది కేవలం అజ్ఞానం. దేవుడు గాని, మంత్రంగాని, మైలపడి పోతారనడం అతి తెలివి. ఇందులోనే గనుక సత్యముంటే " అపవిత్రః పవిత్రోవా " అనే శ్లోకాన్ని సంధ్యావందనంలోంచి కత్తిరించి పారేయాలి. ఆ శ్లోకాన్ని నమ్ముతారో, ఈ సిద్ధాంతాన్ని నమ్ముతారో ఎవరికి వారే తేల్చుకోవాలి. ఇకపోతే పూజాద్రవ్యాలు, పాత్రలు, విగ్రహాలు తాకినందువల్ల అతని అశౌచ వాతావరణం

వాటికి పోకే అవకాశం ఉంది. అది కూడా స్థిర బుద్ధిగల వాడికి వర్తించదు. శోక సంవిగ్నమానసులకు వర్తిస్తుంది. కనుక అశౌచ దినాల్లో పూజాద్రివ్యాదులు తాకకుండా మంత్ర, జప, ధ్యానాదులు నిర్భీతిగా చేసుకోవచ్చు. చేసుకున్నందువల్ల అశౌచం త్వరగా తొలగిపోతుంది. ఆ ఇంట్లో ఇంకొకళ్లు నిర్విఘ్నంగా పూజ జరపడం కూడ చాలా మంచిది. అది పనికిరాదంటే అశౌచ వాతావరణాన్ని ఎక్కువ చేసుకొనడమే అవుతుంది.

ఇక సంవత్సర సూతకం ఉంటుందని ఆ సంవత్సరంలో పుణ్యక్షేత్రాదులు దర్శించడం పనికిరాదని అనడంలో అర్థమే లేదు. పుణ్యక్షేత్రాల్లో ఉన్నవాళ్లకి సూతకం వస్తే ఊరు వదలి వెళ్లిపోవలసి ఉంటుందా! అదీ కాక దహనం చేసిన రోజునే స్మశానం నుండి సూటిగా శివాలయానికి వెళ్లి శివలింగం దగ్గర దీపదర్శనం చేయాలని ఉంది. శివాలయం పుణ్యక్షేత్రం కాక, పాపక్షేత్రమా ?

చెడ్డ నక్షత్రంలో పోతే యిల్లు మూయాలా ?

వ్యక్తి : ఎవరైనా చెడ్డ నక్షత్రంలో పోతే ఆ యిల్లు కొన్ని నెలలు మూసివేయాలంటారు. నిజంగా అలాచేయాలా మూస్తారా ?

మాస్టరుగారు : చెడ్డ నక్షత్రంలో పోవడం తప్పయితే యేవాళ్లు ఎలా పోతున్నారు ? వాళ్ల చేతుల్లో ఉన్న విషయం కాదు గదా అది ! ఒకడు వర్జంలో పుట్టాడనుకోండి.

వాడ్ని అవతల పారెయ్యరుగదా! నక్షత్రాలు చెడ్డవి, మంచివి అన్న విషయం ముహూర్తానికి సంబంధించినది. జనన మరణాలకు సంబంధించినది కాదు. కనుకనే ఋషిప్రోక్త గ్రంథాల్లో ఎక్కడా లేదు. ఇక నిర్ణయసింధు మొదలైన గ్రంథాలు పండిత ప్రోక్తాలేకాని, ఋషి ప్రోక్తాలు కావు. పండితుల మార్గంకావాలా, ఋషులమార్గం కావాలా అన్నది ఎవరికి వారు నిర్ణయించుకోవాల్సిందే.

గరుడ పురాణం మామూలుగా చదవకూడదా?

వ్యక్తి : గరుడపురాణం ఎవరైనా పోయినపుడు తప్ప మామూలు రోజుల్లో సామాన్యంగా ఎవరూ చదవరు, చదవ నివ్వరు. దీనికి కారణం ఏమైనా ఉందా ? మిగిలిన పురాణాల లాగ దీనిని మామూలుగ చదువుకోకూడదా ?

మాస్టరుగారు : గరుడపురాణం ఎవరన్నా చనిపోయిన తరువాత చదువుతారు కనుక, మిగిలిన సమయాల్లో చదవ రాదని అనుకొన్నారు. ఈ విషయం గరుడపురాణంలో గాని, ఏ ఇతర పురాణాల్లోగాని లేదు. పైపెచ్చు గరుడపురాణ పఠనం సకల శుభప్రదమని, భోగమోక్ష ప్రదాయమని, సకల పాపహరమని, ఆయుష్యమని ఆ పురాణంలోనే చెప్పబడి యుంది. నన్నయ్య భట్టుగారు అరణ్యపర్వం వ్రాస్తూ చనిపో యారు గనుక అరణ్యపర్వం మంచిది కాదని అనుకోవడంలో ఎంతటి సత్యం ఉందో దానిలోనూ అంతే ఉంది. పింగళి సూరన్న గరుడపురాణం తెనిగించానని వ్రాసుకున్నాడు. అది "జనములే మెచ్చగ" రచించితినని గర్వంగా చెప్పు

కున్నాడు. అంటే ఆ మెచ్చిన జనము అందరికీ బం
కాలంలోనే వినిపించి ఉంటాడని అనుకోలేం కదా
పద్యాన్ని బట్టి గరుడ పురాణాన్ని ఉదంచిద్రై
రచించాక కూడా తాను జీవించియుండి ఈ పద్యం ప్ర
తెలుస్తోంది. ఆ తరువాత ప్రభావతీ ప్రద్యుమ్నం ప్ర
కూడాను. గరుడపురాణం అతనిప్రథమ రచనగా కని
తరువాత అనేక సత్కావ్యాలు రచించి బ్రతికి బట్ట క
తెలుస్తుంది. సూరనవంటి సత్కవికి లేని భయం మనకి
ఎందుకు ?

## D. పునర్జన్మల తీరుతెన్నులు

### మృత్యువుకు పునర్జన్మకు మధ్య కాలమెంత?

వ్యక్తి : మాస్టరుగారూ! ఒక జీవి దేహం వదిలిన తరువాత మళ్ళీ దేహం ధరించే లోపున కాలపరిమితి సుమారు ఎంత ఉంటుంది? అది దేనిని బట్టి నిర్ణయ మవుతుంది?

మాస్టరుగారు : ఒక జీవి దేహం వదిలిన తరువాత మళ్లా దేహం ధరించే లోపున కాల పరిమితి అందరికీ ఒకలాగ ఉండదు. ఆ జీవి యొక్క పరిణామ స్థితికూడ, అప్పటి సంస్కారం మీద ఆధారపడి ఉంటుంది. దాన్ని అనుసరించిన కార్యక్రమం ఆ ముందు జన్మలో ఎలా అంతమైందో దాన్ని బట్టి ఉంటుంది. నిర్లిప్తత, మానసిక నిశ్చలత, వైరాగ్యం నిత్య సంతోషం సిద్ధించిన వారికి అన్ని కోశాలు పరిపూర్ణ మృత్యువును పొందుతాయి. ఆ కోశాలమధ్య జీవించిన పురుషుడు ఆకాశమైపోతాడు. అంటే ఇక పుట్టడు. ఇదే జన్మ రాహిత్యం, లేక మోక్షం.

మృత్యువు అన్ని కోశాలకి సంభవించక కొన్ని ప్రజ్ఞల పొరలు ఉండిపోయినవాళ్ళు ఎక్కువమంది ఉంటారు. ఆ పొరలలో అంతకు ముందు అసంపూర్ణమైన కార్యక్రమం సంస్కార రూపంగా మిగిలి ఉంటుంది. దానిని పూర్తి చేయాలనే పట్టుదల కూడా సంస్కారంగా ఉంటుంది. అది ఆ కోశాలను పట్టి ఉంచుతుంది. ఈ కోరిక బరువు వలన మరల భౌతిక పదార్థం వైపునకు ఆకర్షించ బడటం జరుగుతుంది. క్రిందటి కార్యక్రమం ఎంత తొక్కిడిగా వదిలి పెట్ట బడితే

అంత తొందరగా మళ్ళీ శరీరంలోకి దిగుతారు. మనస్సుకి, ఇంద్రియాలకి, కోరికలు, రాగద్వేషాలు, ఆస్తిపాస్తులపై ఆశలు గట్టిగా ఉన్నవాళ్ళు అంటే పశువుల్లా జీవించిన మనుషులు ఒక సంవత్సరం దాటుతూ ఉండగా మళ్ళా తల్లి దండ్రుల్ని వెతుక్కునేందుకు సిద్ధపడతారు. అంతకు ముందు పేచీకోరులుగా జీవించి ఉంటే ఆ కసితో తనకు వ్యతిరేక లక్షణం గల తల్లి దండ్రులకు బిడ్డలై పుడతారు. ఆ జన్మ శతృత్వాలతో పగ సాధిస్తూ దేహం విడిచిన వాళ్ళు తన స్వభావానికి గర్భ శతృవులైన స్వభావాలు గల తల్లి దండ్రులకు పుడతారు. పుట్టిన మొదలు వాళ్ళని ఏడిపిస్తూ వాళ్ళచేత తన్నులు, తిట్లు తింటూ పెరుగుతారు. ఇలాంటి వాళ్ళంతా సంవత్సరం కాగానే దిగివస్తారు. బహుశ ఇలాంటి వాళ్ళకోసమే కాబోలు తద్దినాలు సంవత్సరాంతా అదే తిథి నక్షత్రాలనాడు పెద్దలచే నిర్ణయింప బడతాయి కాని వాడు ఆ బిడ్డలకే కొడుకుగా పుట్టాలని ఎక్కడా లేదు ఇతరులతో మైత్రిని, సజ్జనత్వాన్ని సాధించుకొన్న వాళ్ళు తమ బిడ్డలకే బిడ్డలుగా పుట్టవచ్చు. అవి కూడా ఆ బిడ్డల సాధు శీలం గలవాళ్ళు, పరిశుభ్రమైన ప్రవర్తన గలవాళ్ళు అయితేనే జరుగుతుంది.

పరిస్థితులు, చుట్టరికాలు, ఆస్తిపాస్తులు మొదలైన వాటి అంతగా పట్టించుకోని మధ్యమ వైరాగ్యం గల వా పుట్టడానికి చాలా కాలం పడుతుంది. వారి నిర్లిప్తత ననుస రించి ఈ కాల పరిమితి ఐదువేల సంవత్సరాలు దాకా పొ గింప బడవచ్చు.

ఇక మూడవ తరగతి - యోగసిద్ధులు, జితేంద్రియులు, శమదమాదిగుణ సంపన్నులు, తమకోశములపై స్వామిత్వము సాధించినవారు కాలపరిమితికి కట్టుబడరు. లోకశ్రేయస్సు ననుసరించి అవసరాన్ని బట్టి బుద్ధిపూర్వకంగా దిగి వస్తారు. వారే పరమగురువులు మొదలైనవారు. అవసరమైతే అట్టి వారు దేహం విడిచిన ఇరవైనాలుగు గంటల తరువాత ఎప్పుడైనా గర్భస్థులు కావచ్చు. లేదా యుగాల తరువాతైనా దిగి రావచ్చు. 'జ్వాలాకూల్' మహర్షి ఒకే దేహంలో మూడు వేర్వేరు జీవితాలు జీవించాడు. మొదటి ప్రపంచ సంగ్రామంలో సైనికుడుగా భౌతికంగా పనిచేసాడు. అదే రోజులలో తీరుబడి వేళల హిమాలయాల్లోని కులూ లోయ దగ్గర ఒక గ్రామంలో గృహస్థుగా ఉంటూ పాలేళ్లతో వ్యవసాయం చేయించేవాడు. అతడే యితడని ఎవరికీ తెలియదు. రెండు వేర్వేరు పేర్లతో మెలిగాడు. గ్రామంలో వాళ్ళకి అతడి యుద్ధ జీవితం తెలియదు. యుద్ధంలో వాళ్లకి, అతడు భారతీయుడనే తెలియదు. బెల్జియం వాస్తవ్యుడుగా చలామణీ అయ్యాడు. అదే జన్మలో ఇంగ్లండులోనూ, అమెరికాలోను ఉన్న 'యాలిస్. ఎ. బెయిలీ' అనే శిష్యురాలికి, ఆమె అనుయాయులకు దూరదృష్టి, దూరశ్రవణాలతో గ్రంథాలు డిక్టేట్ చేసి అచ్చువేయించాడు. ఆ శిష్యులకు మాత్రం తన మొదటి రెండు పేర్లు తెలియనీయక మూడవ పేరుతో వ్యవహరించాడు. ఆ పేరే జ్వాల్‌కూల్. జ్వాల్‌కూల్ పుస్తకాలు తెలిసిన వాళ్ళకి ఆ వ్యక్తి ఎవరో తెలియదు. తన గ్రామంలో వాళ్ళకి,

యుద్ధంలో వాళ్ళకి అతనికి జ్వాల్‌కూల్ అన్న పేరు
తెలియదు. ఒక్క యాలిస్. ఎ. బెయిలీకి మాత్రం
పేర్లు, వ్యక్తీ కూడా తెలుసు. బ్లావెట్‌స్కీకి రైతు జీ
వ్యక్తి, జ్వాల్‌కూల్ అనే పేరు తెలుసు. చాలాసార్లు
అకస్మాత్తుగా రోడ్డుమీద కనపడి కుత్‌హూమిగారి
లందించి పోయేవాడు. చూపించమని వేధించిన లెడ్
కలలాంటి స్థితిలో మాత్రం దర్శనం యిచ్చాడు. అట్ల
వ్యక్తి 1925 ఆగష్టులో దేహం విడిచి 1926 లో
దేహం ధరించాడు. ఇలాంటి వారికి కాలపరిమితి నిర్ణీత
మిగిలినవాళ్ళంతా పూర్వ కర్మను బట్టి ఎవరి పరిమితి
ఏర్పరుచుకుంటారు.

ఇక నాల్గవ తరగతి తీవ్ర విరోధాల్లో హత్యలు
వాళ్లు, ఆకస్మిక దుర్మరణాలు పొందినవాళ్ళు, భార్యా
మీద అతి తీవ్ర మమకారాలు కలిగి రైలు ప్రమ
మొదలైన పరిస్థితులలో ఇల్లు చేరకుండా దుర్మరణం
వాళ్ళు పూర్తిగా చావడం కష్టం. వాంఛలు పశు
సూక్ష్మ కోశాలన్నీ ప్రజ్ఞను పట్టి వదలవు. వాళ్ళు
ఆపేక్ష ఉన్న స్థలానికి ఆకర్షింపబడి అక్కడ
పోతారు. ఇంటిలో అనుకూలమైన తావునో,
బావినో నివాస స్థలంగా ఏర్పరచుకొని ఉంటారు
కొన్ని వందల సంవత్సరా లుండవచ్చు. ఎవరైనా యో
సంపన్నులు లెంపకాయ కొట్టినట్లు ప్రక్రియ చే
వీళ్ళు పిశాచత్వం నుండి మేల్కొని ఆ కోశాలు విడిచి
రాలేరు. ఈ లోపున దుర్బల మనస్కుల దేహాలను

ఆ దేహాల ఆధారంతో తమ కోర్కెలు తీర్చుకుంటూ ఉంటారు. లేదా పాములు, తేళ్ళు, పక్షులు తమ ఉపాధులుగా స్వీకరించి శతృత్వం కలవారిని హింసపెడుతూ ఉంటారు. అలాంటి ఇళ్ళలోనే నమ్మలేనంత తరచుగా పాములు, తేళ్ళు వస్తూ ఉంటాయి. ఆ పామును చంపితే ఇంకొక పామును ఆవేశించి ఆ శతృవు ఇంటిలోనికి తోలుకుని వస్తాయి. వీళ్ళకి కూడా అతి దీర్ఘమైన కాలపరిమితి ఉంటుంది.

వ్యక్తి : సూక్ష్మమైన అంశాలను సులువుగా కావలసినంత వివరంగా చెప్పారు మీరు. ఈ విషయాలు మీరు చెపుతుంటే మీతో పాటు మేముకూడా ఆయా లోకాలలో ఆయా సత్యాలను దర్శనం చేస్తున్నట్లుగా ఉంది. మీ వాక్కులే కిరణాలై మా కా లోకాలను చూపిస్తున్నాయి. ఆ లోకాల సన్నివేశాలతో మాకు సన్నిహితత్వాన్ని పెంచుతున్నాయి.

అనుకున్నవారికి పుట్టగలమా ?

వ్యక్తి : దేహం ధరించబోయే జీవి తా ననుకున్న తల్లి దండ్రులకు పుట్టడం సాధ్యమౌతుందా మాస్టారూ ?

మాస్టరుగారు : మనస్సులో ద్వేషాలు, శతృత్వాలు, అకారణ దుర్జనత్వం ఉన్నవాళ్లకి ఏదీ తమ వశంలో ఉండదు. దేహంలో ఉండగా మనమే వశంలో లేనపుడు, దేహం విడిచిన తరువాత తల్లిదండ్రులను ఎన్నుకోవడం వశంలో ఎలా ఉంటుంది? అలా కాక శాంతస్వభావులు, దీర్ఘ కోపాదులు లేని వారు, ఈర్ష్యాసూయలు లేనివారు, అపేక్షలు మాత్రం

